# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

సంపుటము 11 | రాజమహేంద్రవరము 1-2-1988 | సంచికలు 6, 7

## ఈ సంచికలో



**రాబోవు సంచికలో :-** వియోగ వేతశాఖిని వేదుల కవితావని, అడిదము సూరకవి చంద్రాలోకము, భిన్న కవిత్వం-రసాద్వైతం, కవికోకిల వనకుమారి, ముఖలింగేశ్వర శతకం మొదలగునవి ఉంటాయి.

1, 16 తేదీలలో ప్రచురింపబడును.

చందా : సంవత్సరమునకు రు. 12.00.
అర్ధసంవత్సరమునకు రు. 6.50.

విడిప్రతి 60 పై.

★ సమాలోచన ★
* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *
సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి
Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry.

# మో. రా. "హంస సందేశము"

—శ్రీ ముదిగొండ ఈశ్వరచరణ్

మోచర్ల రామకృష్ణయ్యగారు సంస్కృత కావ్యరచనలోనే కాక సంస్కృత కావ్యాలను తెలిగించడం లోనూ దిట్ట, ఆయన అనువాద సామర్థ్యానికి 'హంససందేశం' మచ్చుతునక. మో. రా. సంస్కృత కావ్యం 'శారదా ప్రసాదః' 'సమాలోచన ఆగస్టు 1987 లో పరిచయం చేయబడింది.

'హంస సందేశం' శ్రీమద్వేదాంత దేశికుల సంస్కృతకృతికి ఆంధ్రీకృతి. సీతావియోగానల తప్తుడైన శ్రీరాముడు హంస చేత సందేశం పంపడం ఇతివృత్తంగా కల ఇందులో రెండాశ్వాసాలు, 168 పద్యాలు (92+76) ఉన్నాయి.

శ్రీ మద్వేదాంత దేశికులు సంస్కృతంలో అనేక కృతులు రచించారు. వానిలో యాదవాభ్యుదయము, పాదుకాసహస్రము, సంకల్ప సూర్యోదయము, హంససందేశము బహుళ జనాదరణ పొందినవి. పాదుకా సహస్రము శ్రీదేశికుల బహుముఖ పాండిత్య - కవిత్వ మహత్వములకు నెలవు.

సందేశ కావ్యరచన మహర్షి వాల్మీకి రామాయణంలో ప్రారంభమైంది. శ్రీరామసందేశాన్ని లంకలోని సీతాదేవికి ఆంజనేయుడు అందించడం ఇందులో విషయం. మహాభారతం అరణ్యపర్వం - నలదమయంతుల కథలో - మొదటి హంస సందేశం ఒకటి ఉన్నది. ఐతే ఈ రెండున్నూ బృహత్ కావ్యాలలోని ఘట్టాలు కాబట్టి వీటికి ప్రత్యేక కావ్య గౌరవం కలుగ లేదు. ఆ గౌరవాన్ని పొందిన తొలి సందేశకావ్యం కాళిదాసుని మేఘసందేశం. ఆ తర్వాత ఎన్నో సందేశ కావ్యాలు వెలువడ్డాయి - కాని - అకవి లాగే ఆ కావ్యంకూడా ఈ నాటికీ కనిష్ఠికాధిష్ఠితమ్!

మేఘసందేశం బాటలో ఆదికవిని ఆధారం చేసుకొని, శ్రీరాముని నాయకుని చేసి, 'హంస సందేశాన్ని' సంతరించారు శ్రీదేశికులు. మొదటి ఆశ్వాసంలో రాముని వేదన - హంసను దూతగా ఎన్నుకోవడం - లంకకు వెళ్ళే మార్గం, వర్ణించబడ్డాయి. రెండవ ఆశ్వాసంలో లంకావర్ణనం - సందేశ వాక్యాలు చెప్పబడ్డాయి.

శ్రీ మో. రా. ఈ కావ్యాన్ని అనువదించడంలో ఎంతో ఓర్పు - నేర్పు చూపారు. నిజానికి అనువదించటంకన్నా స్వతంత్రంగా కావ్యం రాయడం చాలా తేలిక. అనువాదకుడికి రెండుభాషల్లో పాండిత్యం - ఆ భాషల జీవనాడిని - ప్రయోగ చాతురిని గుర్తించగల సామర్థ్యం, ముఖ్యంగా మూలకవి హృదయ స్పందనను పసిగట్టగల సహృదయతా ఉండాలి. మో. రా. గారికి ఈ మూడు గుణాలున్నూ పుష్కలంగా ఉన్నాయనడానికి ఈ అనువాదంలోని ప్రతి - అక్షరం సాక్ష్యం పలుకుతున్నది.

మో రా గారి కన్నా ముందే శ్రీమాడభూషి వేంకటా - చార్యుల వారే కాక, మరొక రిద్దరు కూడా 'హంససందేశాన్ని తెలిగించినట్లుగా 'తొలి పలుకు' లో శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు చెప్పారు. అయినా 'నా చూచిన రచనలలో శ్రీ రామకృష్ణకవిగారి రచనయే చతురతరముగా నున్నదనగలను. ఇందుకు ప్రధాన కారణము మూలచ్ఛాయాను సారిగా కవి గైకొన్న రచనాస్వాతంత్ర్యమనదగును.' అని వేటూరి వారు అభిప్రాయ పడ్డారు. ఇది మోమోటపు మాట కాదు.

ఈ క్రింది ఉదాహరణను పరిశీలిస్తే శాస్త్రిగారి అభిప్రాయంలోని వాస్తవం తేట తెల్లమౌతుంది.

'సా మే దృష్టి శ్శఫరనయనా సన్నత భ్రూ స్సుకేశీ, తన్వీ తుంగ స్తన భరవతీ తప్తజాంబూనదాభా, బాలా యుష్మత్ప్రతిగమనా చేదిమధ్యా వరాంగీ, శృంగారాఖ్యాంనిధి మధిగతా శ్రేయసీ దేవతేవ!'

దీనికి మో. రా. తెనుగు సేత -

డిస కనుల తూచోడి నీ పోడిమి
గమన విలాసంబు గల పెలంత
ంత తంతిల వాశకలిత - లావణ్యాబ్ధి
యాగవేదీ సమాకాశలగ్న
ప పాక శోధిత స్ఫుట సువర్ణ సవర్ణ
సున్నత భ్రూలతా సాధు వదన
ంగార నిధి నధిష్టించిన దేవత
భాసురగాత్రి సౌభాగ్యలక్ష్మి
క భూజాని తనయ యతుయ వివేక
యు విలలేని కలిమి నా యొలమి చెలిమి
ంవ మెరుగని రూపు నా కంటిచూపు
య్యశోక వనీసీమ నరయుమయ్య!'

న్వ తుంగ స్తన భరనతా' అన్నారు
దేశకులు - మో. రా. దీనినివదలివేశారు.
క్షయ వివేక నిలయ వెలలేనికలిమి
యొలమి చెలిమి - కలువ మెరుగని
పు నా కంటి చూపు' మొదలైన సొంత
వాలను పలికించారు. అంత్యప్రాస,
కంటి చూపు' అనడం సీతపై రాము
కల వ్యగ్రతను సూచిస్తున్నాయి.
లువారు గకహార తులసీదళద్యుతుల్
సంతరించిన మేని సౌరుకాంత
మహండమునుండి యుప్పతిల్లిననాటి
నీలావలపు రూపు నిగ్గు కాంత' -
ంటలైన సీస పద్యాలు -
రావారతరంగ శేగ జనితావర్త క్రమా
ము, క్రాంత్ను స్తబక ప్రవాళ శబలో
ఘ ప్రవాళంబుర - క్షీరాబ్ధి
కాంత కంపిత సురస్తోమా హతా నేక
ం, దారా నికవా మాలిదఘ్న మధు
థం - బవ్వనం బారయున్' మొదలైన
్తాలు మో. రా. ప్రౌఢ ప్రాబంధిక
ందర శైలీ విన్యాసానికి మచ్చుతున
ు.

మో. రా. అనువాద వైఖరిలో శబ్దంబను
ంచియు-నభిప్రాయంబు గుర్తించియు
తంబు పలక్షించియు - రసంబు పోషిం
చియు - నలంకారంబు భూషించియు -
నౌచిత్యం బాదరించియు-ననౌచిత్యంబు
బరిహరించియు - మాతృకాను సారము
చెప్పితి'నన్న శ్రీనాథుని తీరు స్ఫురిస్తున్నది.

దీనిని అనువదించడంలో మో. రా. ఒక ఉరమార్గాన్ని ఉపలక్షించారు. 'ఉప క్రమణిక'లో ఆయన ఇలా ఉగ్గడించారు. 'శ్రీ సీతారాము ప్రణయ కథా సందర్భ గర్భితమైన ఈ కావ్యమును ఐహికాముష్మిక కల్యాణ హేతువన్న ప్రత్యయమున నే నాంధ్రీకరించితిని.'

ఈ సందర్భంలో 'పుట్టు కృతార్థతం బొరసె, పుణ్య చరిత్రుడనైతి' నన్న తిక్కనగారిని తలచుకుంటే ఈ నిసర్గ రమణీయ భక్తి భావన పెల్లూరి వారికి పుట్టుకతో పుట్టినదని తోస్తున్నది.

— ·· —

# బాపిరాజుపై జరిగిన, జరగవలసిన పరిశోధనలు

డా॥ వి. వీమ్మన్న,
ఎమ్.ఏ.,పిహెచ్. డి.ఎస్.పి.జి.డి.ఐ.ఎస్., డి.ఐ.హెచ్., డి.ఐ.టి.,

'బాపిరాజు ఆధునిక విషయ పరిజ్ఞానము మితిలేనిది. ఒక కవిత్వము, ఆధునిక వైద్యము, రాజకీయములు, న్యాయ శాస్త్రము, సాంఘిక వ్యవస్థ, ఆంగ్లేయ సారస్వతము ఒక విషయమేమిటి? దేనిని గూర్చియైన నతడు సమగ్రముగ తెలిసి చర్చించెడివాడు' అని బాపిరాజునుగురించి కొనియాడారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు. ఇది నూటికి నూరు పాళ్ళు సత్యం

బాపిరాజు రచనలు ఎన్నిసార్లు చదివితే అన్ని క్రొత్త ఆలోచనలు వస్తాయి. అందుచేతనే వీరి రచనపై ఎనలేని పరిశోధన జరిగింది. జరుగుతుంది. ఇంకా జరగాలి కూడా.

సాహితీమూర్తి బాపిరాజు రచనలపై జరిగిన,జరగవలసిన పరిశోధనలను గురించి సమగ్రంగా వివరించడమే ఈ వ్యాస ముఖ్య ఉద్దేశం.

## 1. జరగిన పరిశోధనలు

### అ. వ్యాసాలు :

బాపిరాజు సాహిత్యంపై తెలుగు, ఇంగ్లీషు భాషల్లో త్రిలిఙ్గ, కాంగ్రెస్, వాణి, ఆంధ్రజనత, కిన్నెర, త్రివేణి మొదలగు పత్రికల్లో 70 వ్యాసాలొచ్చాయి. కథలపై 4, నవలలపై 11, కవిత్వంపై 6, చిత్రలేఖనంపై 10, ఇతర విషయాలపై 81మొత్తం డబ్భైవ్యాసాలు ముద్రితమైనాయి.

ఆకాశవాణి విశాఖ, విజయవాడ, కడప, హైదరాబాద్ రేడియో కేంద్రాల్లో బాపిరాజు సాహిత్యంపై 7 వ్యాసాలు ప్రసారమైనాయి.

'బాపిరాజు సాహిత్యం విమర్శ'అనే విషయంపై డాక్టర్ మన్నవ సత్యనారాయణ 'ఇంటర్ వ్యూ' 17-11-87 తేదీన హైదరాబాద్ దూరదర్శన్ కార్యక్రమంలో ప్రసారమైంది. ఇది చెప్పుకో దగ్గ విషయం.

ఇవికాక నేను బాపిరాజుపై నవభారతి, స్రవంతి, సమాలోచన, శ్రీ వాణి, సాధన, ప్రసారిక, ఆంధ్రజ్యోతి, ఆంధ్రపత్రిక, విశాలాంధ్ర మున్నగు పత్రికల్లో 47 పరిశోధన వ్యాసాలు వ్రాసాను. బాపిరాజు కథలపై 18, కవిత్వంపై 12, నవలలపై 2, చిత్రలేఖనంపై 8,ఇతర విషయాలపై 11, మొత్తం నలభైఏడు వ్యాసాలు ప్రచురితమైనాయి. ఇంకను అముద్రితంగా 1J వ్యాసాలు

న్నాయి. ఇవి కూడా త్వరలో ముద్రణ భాగ్యానికి నోచుకోబోతున్నాయి.

బాపిరాజుపై తెలుగు వ్యాసాలేకాక 6 ఇంగ్లీషు వ్యాసాలు కూడా వచ్చాయి. మొత్తం మీద బాపిరాజు రచనలపై తెలుగు, ఇంగ్లీషుల్లో 180 వ్యాసాలొచ్చాయి.

ఆ. ప్రత్యేక సంచికలు

బాపిరాజు జీవితం, సాహిత్యంపై మూడు ప్రత్యేక సంచికలు వెలువడ్డాయి.

రావులపర్తి భద్రిరాజు సంపాదకత్వంలో 'కులపతి' ప్రత్యేకసంచిక జూన్ 1954 లో వెలువడింది. ఇందులో బాపిరాజును గురించి10 చక్కని వ్యాసాలున్నాయి.

కంచి వాసుదేవరావు సంపాదకత్వంలో 'చుక్కాని' అనె సంచిక అక్టోబరు 1962 లో ముద్రించబడింది. ఇందులో 0 మంచి వ్యాసాలు పొందుపరచబడ్డాయి.

డాక్టర్ దిట్టకవి శ్యామలాదేవి సంపాదకత్వంలో బాపిరాజు 90 వ జయంతి సందర్భంగా 'నాద బిందు కళకళ' అనే సంచిక అక్టోబరు 1895 లో ప్రచురించబడింది. ఇందులో 15 పరిశోధన వ్యాసాలున్నాయి.

ఇ. సిద్ధాంత గ్రంథాలు

బాపిరాజు సాహిత్యంపై ఐదు పరిశోధన గ్రంధాలొచ్చాయి. ఒక పరిశోధన గ్రంథం ముద్రణకు నోచుకుంది.

1. ముద్రితాలు .

డాక్టర్ మన్నవ సత్యనారాయణ '(శ్రీ) అడివి బాపిరాజు నవలా సాహిత్యాను శీలనం' అనే విషయంపై గుంటూరు నాగార్జున యూనివర్శిటీలో 1981 లో పిహెచ్. డి. చేశారు. ఇది 1954 లో ముద్రణ పొందింది. ఇందులో బహుముఖ ప్రజ్ఞాశాలి బాపిరాజు, సాంఘిక నవలానుశీలనం, చారిత్రక నవలానుశీలనం, ఆంధ్ర నవలా వాఙ్మయం - బాపిరాజు స్థానం ఇత్యాది అంశాలని గురించి రచయిత వివరంగా చర్చించారు

2. అముద్రితాలు

డాక్టర్ ధనిరెడ్డి విజయలక్ష్మీదేవి 'అడివి బాపిరాజు నవలలు _ ఒక పరిశీలన' అనే విషయంపై 1980 లో తిరుపతి, శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీలో పిహెచ్. డి. చేశారు. ఈ గ్రంథంలో బాపిరాజు జీవన సగ్రకంతి, వస్తుశిల్పం, పాత్రనిర్మాణశిల్పం, రచనాశిల్పం మొదలగు అనేక అంశాలు విపులంగా చర్చించబడ్డాయి.

శెట్టి వెంకట నారాయణ 'అడివిబాపిరాజు నవల _ నారాయణరావు, ఒక విమర్శనాత్మక అధ్యయనం' అనే విషయంపై 1981లో వరంగల్, కాకతీయ యూనివర్సిటీలో ఎమ్. ఫిల్. చేశారు. ఇందులో సమకాలీన రాజకీయాలు, సాంఘిక మత పరిస్థితులు మొ॥ అంశాల్ని వివరించారు.

డాక్టర్ పి. తిరుపతయ్య 'అడివి బాపిరాజు అతని రచనలు _ విమర్శనాత్మక పరిశీన' అనే విషయంపై 1982 హైదరాబాదు, ఉస్మానియా యూనివర్శిటీలో పిహెచ్. డి. చేశారు. ఇందులో రచయిత బాపిరాజు వ్రాసిన అన్ని ప్రక్రియలను గురించి సువిమర్శ చేశారు

నేను 'అడివి బాపిరాజు కథలు, కవిత్వం _ పరిశీలన' అనే విషయంపై 1985 లో వాల్తేరు, ఆంధ్రాయూనివర్శిటీలో పిహెచ్. డి. చేశాను. ఇందులో బాపిరాజు జీవితం, సాహిత్యం, బాపిరాజు కథలు _ సంవిధాన శిల్పం, బాపిరాజు కవిత్వం, పరిశీలన, తెలుగు సాహిత్యంలో బాపిరాజుస్థానం అనేఅంశాలని గురించి విపులంగా వివరంగా విశ్లేషణాత్మకంగా వివరించాను.

మొత్తం మీద బాపిరాజు రచనలపై 180 వ్యాసాలు, 3 ప్రత్యేక సంచికలు, 4 పిహెచ్. డి. లు, ఒక ఎమ్. ఫిల్. వచ్చాయి.

డాక్టర్ దిట్టకవి శ్యామలాదేవి ప్రస్తుతం హైదరాబాద్, ఉస్మానియాయూనివర్సిటీలో బాపిరాజు సాహిత్యంపై డి. లిట్. చేస్తున్నారు.

బాపిరాజు వాఙ్మయంపై ఇంతవరకు వెలువడిన పరిశీలనా వ్యాసాలు, పరిశోధనా గ్రంథాల సమగ్రపట్టిక త్వరలో వెలుగులోకి రాబోతోందని చెప్పడానికి నేను చాలా సంతోషిస్తున్నాను.

2. జరుగవలసిన పరిశోధనలు :

బాపిరాజుపై జరిగిన దానికంటే జరగవలసిన పరిశోధన ఎక్కువగా ఉంది.

ఆయన నవలలపై జరిగినంత పరిశీలన ఇతర రచనలపై జరగలేదు. అయినా ఇంకా బాపిరాజు నవలలపై విశ్లేషణాత్మక పరిశీలన జరగవలసి ఉంది. బాపిరాజు నవలలు _ జాతీయోద్యమ ప్రభావం, సామాజిక దృక్పథం, లలిత కళలు' రసపోషణ, పాత్రపోషణ, శాస్త్రవిజ్ఞానం, మనోవిశ్లేషణ, బాపిరాజు దృష్టిలో బాపూజీ, లోకజ్ఞత, సుభాషితాలు, సామెతలు, జాతీయాలు, మాండలీకాల పరిశీలన, ఇలా కేవలంవారి నవలలపైనే పుంఖానుపుంఖాలుగా ఎన లేని పరిశోధనావ్యాసాల్ని వ్రాయవొచ్చు.

నవలల తర్వాత చెప్పదగ్గ పరిశోధన ఆయన కథలపై జరిగింది. కాని ఇంకా జరగాలి కూడా. బాపిరాజు కథలు. కుటుంబ జీవన చిత్రణ, సౌందర్యోపాసన, ప్రేమ, సెక్సు, హాస్యం, శృంగారం, ఇలా వారి కథలపై పరిశీలనా వ్యాసాల్ని వ్రాయవొచ్చు.

# శతకంఠ రామాయణము - ఒక పరిశీలన

—శ్రీ ఏ. క్రిష్టప్ప, ఎం. ఏ.,

వేద వేద్యే పరే పుంసి
జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీ
త్సాక్షాద్రామాయణాత్మనా

వేదవేద్యుడు శ్రీరామచంద్రుడుగా, వేదము రామాయణముగా నవతరించెనని శ్రీ వాల్మీకి సూక్తి. భారతదేశము రామకథకు పుట్టినిల్లుగా భావింపబడుచున్నది. సంస్కృతమున వాల్మీకి రచించిన శ్రీమద్రామాయణమునకు ఆదికావ్యమని ప్రశస్తి కలదు. తెలుగులో రామకథకు సంబంధించిన కావ్యాలు శతకాది సాహిత్య ప్రక్రియల్లో సుమారు అయిదు వందలుండవచ్చును. ఇందులో శతకంఠ రామాయణ మొకటి. దీనికి సీతావిజయమని నామాంతరము గలదు. ఈ కావ్య కర్తృత్వ విషయములో విమర్శకులలో భిన్నాభిప్రాయములు గలవు. వీరేశలింగం పంతులుగారి కవుల చరిత్రములో లింగకవి, గంగన యను నిరువురు సీతావిజయము రచించినట్లు గలదు. శతకంఠ రామాయణము (వావిళ్ళ వారి ప్రతి) నాల్గు ఆశ్వాసములుగల పద్యకావ్యము. ఆశ్వాసాంత గద్యలవలన శతకంఠ రామాయణమును రచించినది మర్దన కవి యనియు, ఈతడు మదీయకార్తి నివాసి యనియు, ఆంధ్ర గీర్వాణ భాషాప్రవీణుడనియు, ఆత్రేయ గోత్రుడనియు ధర్మనార్య పుత్రుడనియు తెలియుచున్నది. 'ఇట్టి విచిత్రంబగు చరిత్రంబు నెన్నండును వినియును, గనియును నే నెఱుంగను' (1-187), 'ఇట్టి చమత్కార కథావిధానం బెన్నడును వినియెఱుంగను' (4 94) అని పార్వతి ఈశ్వరునితోఁ బల్కియుండుటనుబట్టి, శతకంఠ రామాయణము విచిత్రమైన చరిత్ర మని, క్రొత్త దని, కథావిధానంలో చమత్కారమున్న దని తెలియును.

సీతాదేవి యుద్ధంలో శతకంఠుని సంహరించిన కథ యిందలి యితివృత్తము. పులస్త్యునకు విశ్రవసుడు, అత్రముడు నను నిరువురు పుత్రులు గల్గిరి. విశ్రవసునకు రావణాదు లుదయించిరి. అత్రమునకు చాలకాలము సంతానములేక చింతించి త్రిమూర్తులను మెప్పించి శతకంఠునిఁ బడసెను. విశ్వకర్మచే సముద్రమధ్యమున ప్రతాపలంకను నిర్మింపజేసి శతకంఠునకు బట్టము గట్టెను. శతకంఠుడు తనసోదరులైన రావణాదుల మరణమును విని మండిపడి అందులకు కారణమైన రాముని సంహరింప దలచి తపంబుజేసి, యక్షాది పురుషుల వలనను, మృగాండజ భుజంగమ లోకంబులవలనను, మీనాది జలచరసమయంబువలనను, మరణంబు లేకుండునట్లును, రణంబు సేయునెడఁ దన శరీరంబునం గల శోణితకణం బెచటం దొలంగునచట మార్గురు శతముఖులు జనించునట్లును; జరయును, శ్రమయును, పరితాపంబును, భయంబును, దైన్యంబు నెన్నండును దన్నుంబొరయ కుండుటను, బ్రహ్మచే వరములం బడసెను. శతకంఠుడు రామునిపై పగబూని, గోబ్రాహ్మణముని దేవతా సంఘములపై దాడి చేసెను. ఆ దాడికి తాళలేక మునులు శ్రీరాముని శరణు జొచ్చిరి. వారికి శ్రీరామచంద్రుడు శతకంఠుని సంహరించెద నని యభయ మిచ్చెను. శ్రీరాముడు లక్ష్మణాది సోదరులతోను పుత్రులు కుశలవులతోను, మనుమడు విజయునితోను హనుమత్, సుగ్రీవ, విభీషణాదులతోను శతకంఠునిపైకి యుద్ధమునకు బయలుదేరెను. హనుమంతుడు తన వాలంబున నఖిల దళంబును సముద్రము దాటించెను. తర్వాత శ్రీరాముడు హనుమంతుని శతకంఠుని వద్దకు రాయబారము పంపెను. యుద్ధము జరిగెను. శ్రీరాముని పుత్రులు, తమ్ములు శతకంఠునిచేఁ గూలిరి. శతకంఠుని ప్రభావంబును జూచి శ్రీరాముడు కళవళించుటతో సీత విల్లందుకొని శతకంఠునితో యుద్ధము చేసెను. నారదహితోపదేశములో సీతాదేవి బ్రహ్మాస్త్ర ప్రయోగము చేసి శతకంఠునిసంహరించెను. శతకంఠుని పుత్రుడైన నీలకేతునకు బట్టాభిషేకంబు

---

బాపిరాజు కవిత్వంపై తగినంత పరిశోధన చేసి కవితాశిల్పం, గాంధితత్వం, ఇత్యాది అనేక విషయాలపై పరిశీలనా వ్యాసాల్ని వ్రాయవచ్చు.

బాపిరాజు తదితర రచనలైన ఏకాంక నాటికలు, రేడియో నాటికలు, జానపద సాహిత్యం, వ్యాసాలు, లేఖలు, చిత్రలేఖనం, సంపాదకీయాలు మొ॥ వాటిపై పరిశోధన చేయవలసి ఉంది.

తెలుగు జర్నలిజం - బాపిరాజుస్థానం, పత్రికా రచయితగా బాపిరాజు, విమర్శకుడుగా బాపిరాజు, ఆధునిక చిత్రకళ-బాపిరాజు, బాపిరాజు సాహిత్యం-చిత్రలేఖనం, బాపిరాజు చిత్రాలు - అందాలి సొగసులు, బాపిరాజు - అతని జాతకం, బాపిరాజు సాహిత్యంలో స్త్రీ, తెలుగు సాహిత్యంపై బాపిరాజు ప్రభావము, బాపిరాజుపై ఇతరుల ప్రభావము ఇలా శీర్షికలుగా కళాతపస్వి బాపిరాజుపై పరిశోధక వ్యాసాలు వ్రాయవచ్చు.

విమర్శకులైన సాహితీ పరిశోధకులు ఈ పై అంశాల్ని కూలంకషంగా పరిశీలిస్తారని మనస్ఫూర్తిగా ఆశిస్తున్నాను.



గాంచి శ్రీరాముడు తన పురంబునకుఁ జేరి, రాజ్యము పాలింప దొడగెను.

మర్దన కవి శతకంఠ రామాయణము నందు శాస్త్రీ పోషణా చాతుర్యమును ప్రదర్శించెను. సీతాదేవివిలువిద్యా నైపుణ్యమును, పాతివ్రత్యమును, చిత్రగంధి పుత్ర వాత్సల్యమును, హనుమంతుని పరాక్రమమును వర్ణించెను.

యుద్ధరంగమున సీతాదేవి శతకంఠుని పైకి బాణప్రయోగము చేయుచు నిట్లనెను.

'అవనిపై నే పతివ్రత నైతినేని
యరయ రాముండు ధర్మాత్ము డగునేని
వేదములు సత్యమగు నని పేడు నిమ్మ
హాస్త్రమున దగ్ధుడగుఁగాక యనుచు
నేసె' (4-156)

శతకంఠుడు నేలగూలెను. దీనివలన సీత పాతివ్రత్యము, రాముని ధర్మజ్ఞత వెల్లడి యగును.

శతకంఠుని మృతదేహమును గాంచి, చిత్రగంధి విలపించిన తీరు ఆమె పుత్ర వాత్సల్యమునకు దార్కాణము.

'రాఘవునిఁ జంపి జానకీరమణి కీవు
తలకు వెప్పుడు మదిని వైధవ్య మొందవ
నది మృషావాదమై నీని జాంగనలకు
నహహ వైధవ్య మొసవె నటంచు
మతియు' (4-169)

శతకంఠ రామాయణమునందు వర్ణనలు తక్కువ. కథకే ప్రాధాన్య మెక్కువ. ఇందు సూర్యోదయాస్తమయ, సముద్ర, యుద్ధ వర్ణనములు గలవు. సూర్యోదయ వర్ణనము మర్దనకవి రమణీయ భావమునకు దార్కాణము.

'సెమ్మి నంబరమనియెడు కమ్మరీడు
గరమ ప్రాగ్భాగ సాంధ్య రాగంబు
కొలిమి
యందుఁ గ్రాగిన యట్టి లోహంపు ముద్ద
వెడలఁజేసెనో యన రవి వొడిచె నపుడు
(1-171)

ఆకాశమనెడు కమ్మరి నెమ్మదిగా ప్రాగ్భాగ సాంధ్య రాగమను కొలిమి యందు కాగిన లోహపు ముద్దను వెడల జేసెనో యన్నట్లు రవి పుట్టె నట.

శ్రీరాముడు యుద్ధరంగమును బరికించుచుఁ జనియెడు సమయమున యుద్ధభూమి - అందు పడిన మొండెములు, రక్తము, మాంసఖండములు వర్షాకాలము వలె దోచెనని వర్ణించెను.

'కొండలవలె నేల గూలిన మద గజ
ఘనకదంబము ఁ మేఘములు గాగ
మోకాలి బంటితో నేకమై యాడాడ
గనుపట్టు పిదడు పంకంబు గాగ
నలుగుల కాకున నిలబడు మాంసఖం
డములు దామింద్ర గోపములు గాగ
బలువిడి నెడ నెడ బాఱెడి రక్తంబు
లంబు పూర ప్రవాహంబు గాగ
వాహినుల గుంపు శరముల వాన గాగ
మొనల హుంకృతు లవి యుఱుములును
గాగ
వర్ష కాలంబు చాడ్పున వారి కన్ను
గవలకప్పుడ చె నప్పు డక్కజముగాను.
(4-115)

పైవర్ణనము భావగంభీరమై యాదృశ్యమును ప్రత్యక్షము చేయుచున్నది.

శతకంఠ రామాయణము నందు పోతన భాగవతము, మొల్ల రామాయణము, కంకంటి పాపరాజు ఉత్తరరామాయణము అను కావ్యముల ప్రభావము కనబడు చున్నది.

మర్దనకవి, పోతన; కావ్య ఫలశ్రుతిని, కావ్యప్రశస్తిని, చెప్పిన తీరు లొకే విధముగా నున్నవి.

'ఈచరిత రాఘవుని దట
యీచేతను బుట్టివారి
యీ మహిమ మొగిన్
నీ చేత బలుక బడెనట
చూచిన వ్రాసినను విన్న
శుభమిం పొందున్' (శ. రా. 1-4)

'పలికెడిది భాగవత మట
పలికించు విభుండు రామభద్రుండట, నే
పలికిన భవహర మగు నట
పలికెద వేఱొండుగాథ పలుకగ నేలా,'
(భాగ. పీఠిక 16)

సీత శతకంఠుని సంహరించుటకు శ్రీరామునితో బయలుదేరుట, యుద్ధరంగమున శతకంఠునితో యుద్ధము చేయుట పోతన భాగవతమునందలి సత్యభామ నరకాసురుని సంహరించుటకు శ్రీకృష్ణునితో బయలుదేరుటను, సత్యభామ నరకాసురునితో యుద్ధము చేయుటను తలపించుచున్నవి. సీత, సత్యభామయు యుద్ధమునకు బయలుదేరుటకు కారణము వారి భర్తల యుద్ధ నైపుణ్యమును చూచుట మాత్రమే.

'దేవా! నీవు నిశాట సంఘముల నుద్దీపించి చెండాడనీ, ప్రావీణ్యంబులు చూడ గోరెదు గదా ప్రాణేశ మన్నించి నన్ నీ వెంటంగొని పొమ్ము ... '
(భాగ. 10-151)

'... మీరు యుద్ధంబు సలుపునపుడు
చూడగాఁ గోరి, మహోగ్ర రక్షోగణేంద్రు
డెప్పు డుదయించునో యని యెదురు
చూతు
గావున మెల్లన ఫలియింప గలిగె నేను
మీ జయము గాంతు నను గొని యాజి
కరుగుడు' (శ. రా. 4-38)

సత్యభామ నరకాసురునితో యుద్ధము చేయుటను గాంచిన శ్రీకృష్ణుఁడు, సీత శతకంఠునితో యుద్ధము చేయుటను గాంచిన శ్రీరాముడు మనంబున ప్రశంసించిన విధ మొకటిగా నున్నది.

'వీణ జక్కగ బట్టనేర వెలుంగని కొమ్మ
బాణాసనం బెట్టు పట్ట నేర్చె
ప్రమాదన దీగ సూర్పంగ నేరని లేమ
గుణము నే క్రియ ధను ష్కోటిఁ గూర్చె'
(భాగ. 10-181)

'పుష్పంబు లఱచేతఁ బూననేరని చేలి
యెట్లు శరంపరఁ బూన నెట్లు నేర్చె
బెల్కు పల్కులకు బిట్టులక్కు కోమలి
యిల

రొల్ల ధీతిల నార్య సెట్లు సేర్చి'
(శ. రా. 4-90)

కంకటి పాపరాజు ఉత్తర రామాయణమున రావణుడు రంభను బలాత్కరించిన విషయమును తెలుసుకొన్న నలకూబరుడు శాప మొసంగెను. శతకంఠ రామాయణమున శతకంఠుడు కన్యామాని కూతురుని బలాత్కరించిన విషయమును గ్రహించిన కన్యామాని శాప మొసంగెను. శాపములు రెండును జాతే తీరుగ నున్నవి.

'ఈ దనుజుండు కోరిక వ
హింపని రంభను బల్మి బట్టిన
ట్టాడట నింక నొప్పని మ్ర
గాక్షుల బల్మిని బట్టె నేని స
ద్యోన్మదము దీఱ నంత శిర
ముల్ పదియుం బది నూఱు వ్రక్కలై
మేదినిఁ గూలుఁగావుత ని
జేప్సమాలో భువనంబు మెచ్చగన్'
(శ. రా. 4-285)

'ఇట్లు దుర్మదంబున వరుదెంచి నా పెంపుడు కూతుని త్తలంగున మానభంగంబు గావించి ప్రాణంబులం గొనియున్న వాడవుగాన నింతిచే నిట్లు నీ తలలు తునియలై మరణంబు నొందగల వని శపించె'
(శ. రా. 4-150)

శతకంఠరామాయణమున శతకంఠుని నాభిస్థానమందు అమృత భాండముగల దని నారదుడు శ్రీరామునితో శ్రీరాముడు సీతతో నుడివి ఆగ్నేయాస్త్రము ప్రయోగింపజేసెను.

దీని నాభిని జొట్టిరా బూని యల వి
ల్వ్య సంజీవ కరణులు తుల్యముగను
గలిగి యున్నవి తద్వస్తు ఘనతఁ జేసి'
తలలు గరములు దెగియును మొలవ
దొడగ

బలిమి నటుగాన నాగ్నేయబాణ మేసి,
సత్తదు గ్రొవ్వధుల నెల్ల దగ్ధములుగ
జేసి, బ్రహ్మాస్త్రమున నొండె వాడిగల్గు
కత్తిచే నొండె దైత్యుని సంహరించు
(శ. రా. 4-148,144)

ఈ విషయము మొల్లరామాయణము నందలి రావణుని నాభిస్థాన మందలి అమృత భాండము గలదని విభీషణుడు రామునితోఁ జెప్పి ఆగ్నేయాస్త్రము ప్రయోగింప జేసిన విషయమును తలపించుచున్నది.

'పోలగ నాతని నాభీ
మూలంబున నున్న యమృత
మును మొదలను ని
ర్మూలముగా శ్రీ రఘు భూ
పాలక తెగ ద్రేయు మగ్ని
బాణము చేతన్'
(మొ. రా. యు. కృ. 96)

శతకంఠుని మరణానంతరము చిత్రగంధి పలుకులు రావణుని మరణానంతరము మండోదరి పలుకులను దలపించుచున్నవి.

'తెలియ రాఘవుడాది మహిష్ణుడంట
సుదతి జానకి యాపరంజ్యోతి యంటి
గపులు సురలంటి జయములు గలుగ వంటి
నకట విన నేరవైతి నేమందుఁ దనయ'
(శ. రా. 4-168)

'రామచంద్రుడె యాది నారాయణుండు
గపులె దేవతలని నీవు గానబడక
యెల్ల వేళల నే జెవి నిల్లు గట్టి
విన్నతము నీవు నామాట వినకపోతి'
(మొ. రా. యుద్ధ. కృ. 12)

ఈ విధముగ శతకంఠ రామాయణము మధుర భావములు గల్గి, చమత్కార కథా విధానముగల్గి, పోతన భాగవతాది కావ్యముల ప్రభావము గల్గి, రసవంతముగ నున్నది. రామాయణము నెందరెన్ని విధముల గొనియాడినను ఏదో క్రొత్తదనమున్న ట్లనిపించును గదా!

—•••—

# కన్నీటి కణాలు

— డా॥ శివలెంక ప్రకాశరావు

*ఇచ్చోటనే గదా! యీశ్వరుండలరెస్వ
యంభువనంగ దేవాలయమున
ఇచ్చోటనే గదా! రొల్లరాజుల గెల్చి
రుద్రదేవుని ప్రభభద్ర మొంగె
ఇచ్చోటనే గదా! కుచ్చుపాగను జుట్టి
భద్రకాళిని మించె రుద్రమాంబ
ఇచ్చోటనేగదా! రొలి కన్నుడిపించు
ఘనుఁడు వసించె యుగంధరుండు
ఇట్టి చోటున సర్వము మట్టిపాలు
గ నొనరింపఁగాఁబడి, తనకనుల నీరు
నింపుకొనుచున్నది చరిత్రసంపుటమున
ఆక్కతొలఁగిన కాకతి లక్ష్మి నేఁడు!

*కూరుల లక్షణం బనుచుఁ
జూపరు లెంతురటంచు నెంచిరో!
పేరు ప్రతిష్ఠ లెల్లపుడు
పెంపువహించు ననన్ దలంచిరో!
ఘోరముగా నొనర్చి రల
క్రూరవనుల్ తుగ్లకాదులున్
వారల నేమి జేసినవో?
ప్రాణములేని శిలాస్వరూపముల్!

*ఆనందమునకు నిలయం
బైనతి కెక్కిన 'ఖుషీమహ' లిప్పుడు శోభా
హీనంబై ఘూకంబుల
స్థానంబై యేడిపించు దండకవనమై!
*అరెరే! యింతటి ఘోరపాతకము! స
ర్వాధీశుఁ డాప్రాభవా
మరనాథుండగు నాప్రతాపుని శిరం
బాధూళిఁ బొర్లాడుము
ష్కరులా తుగ్లకు వంశ్యు లెట్లుపగతో
సాధించి, బాధించిరో?
నరులారా! యెదడిందు వండ కనుఁడ
న్యాయంబు రూపించెదన్!

*చక్కని శిల్పసంపదలు
సమ్మెటపోటుల జీవలేశమై
ముక్కలు ముక్కలై పరమ
మార్గుల చిత్తములే కలంచు నిం

పెక్కాడి దేవళంబులను
 బీటలు వారఁగఁ జేసినారు వా
రెక్కడ దాపురించిరో ప్ర
 రీశ్వరి శోభను రూపుమాపఁగన్!
*ముఖమండలపు సొంపు పొట్టఁబెట్టు
 కొనంగ

 ముగ్ధలఁ గనలేని మూర్ఖులే మో!
పట్టణం బెల్లను మట్టి పాల్చేసిరి
 రుద్రభూముల నేలం రుద్రులేమో!
దేవాలయమ్ములు దైవశూన్యముఁ జేయఁ
 బరమత ధ్వంసు ముష్కరులదేమో!
రాతిలోపలఁ గూడ రత్నాలను వెదకి
 చూచిన సంపన్మరీచులేమో!
కాకతీయ వైభవమును గాల్చివేయఁ
బుట్టినట్టి యాకలి యుగ పురుషులేమో!
లేకయున్న నాదుర్మార్గులాక లేక
బీల్చివేసిరో? సామ్రాజ్య విభవమెల్ల.
*ఇయ్యెడనే శిలన్ గనిన
 నేమిరాయిగాని హృదంతరాళమున్
చెయ్యిని బెట్టి కల్చినటు
 చేతన మంత దొరంగి దేహమే
కొయ్యగ మాఱినట్లు మది
 గొల్లుమటంచును నేడ్చె నట్టులే
సెయ్యమె జాపి రమ్మనుచు
 నెమ్మది బిల్చిన యట్లు దోఁచెడిన్.
*ఏమిది ఇంత మాంద్యమెదో
 ఇట్లు విషాదము గూర్చుచుండె నీ
భూమిని నిల్చినంతనె ఆ
 పూర్వవిశేష విభావసంపదల్
మాటికి డెంద మందొడగి
 ప్రొన్నపడి యుండగఁజేయు చుండెనా
మోమున పిల్ల తెమ్మెరలం
 మూర్కొని ముంగుఱు పాగినంతనే!
*గాలులా! ఇవి కావు కాకతీయ ప్రభా
 కలిత ప్రవాహంపు కలలుగాని
భూములా! ఇవికావు ప్రోలరాజాదుల
 విమల సత్కీర్తి ధామములుగాని
శిలలా! ఇవియుకావు శిల్పుల చేతిలో
 శ్రమల నోదిగిన మైనములుగాని
మట్టియా! ఇది కాదు మానిని రుద్రమ
 తట్టిలేపిన మగతనముగాని

ఇచటిగాలులు, భూములు, నిచటిశిలలు,
మట్టి, ప్రాచీన సంస్కృతి మహిమగూర్చి
తెల్పుచుండును సతతంబు తెలుగుజాతి
పూర్వవైభవోన్నతులను బొందుగాను.
(ఆకాశవాణి-విశాఖవారి సౌజన్యంతో)

---

గోదావరిపై ఆనకట్టను నిర్మించిన

# 'కాటన్ మహర్షి'

—శ్రీ దిగవల్లి వేంకటరత్నం, బి. ఏ., ఎల్ ఎల్.బి.,

'భారతదేశ ప్రజలు ఏల దరిద్రులుగా నున్నారు? ఏలయనగా, వారికి మానవ పరిశ్రమకు బదులుగా పనిచేయుటకు ఎడ్లు తప్ప వేరే యంత్రసాధనములు లేవు. తమ పరిపాలకులగు ఆంగ్లేయులు భోగము లనుభవించుట కొరకు వీరు అమితశ్రమ పడవలసియున్నందున కడుపు నిండా కూడు, కట్టుబట్ట నిలువనీడయు చేకూర్చుకొనుటయే కష్టతరముగా నున్నది. ఇంగ్లాండు దేశప్రజలు తమ సౌకర్యముకొరకు పడుపాటుకన్న అక్కడ ఆవిరి, నీరు, రోడ్లు, కాలువలు, రైళ్ళు, రేవులు, నౌకాశ్రయములు, వారికి కలిగించు సౌకర్యములు హెచ్చుగా నున్నవి. భారతదేశమున అన్నియు నున్నవికాని, అన్నిటికన్న పెద్దలోప మొక్కటే యున్నది. అది మనమా దేశము నాక్రమించి పరిపాలించుట మొదలిన నాటి నుండి ఇప్పటి వరకును భారతదేశమును అవిద్యాంధకారమునందు, దారిద్ర్యమునందు ముంచిన పెద్దలోపము.'

ఇంగ్లాండులో నున్నచో ఆదేశమున తనకు గౌరవప్రదము అని తలచుకార్యము అన్నింటిని చేయు మానవుడే, హిందూ దేశమున సూర్యోదయమునుండి సూర్యాస్తమయమువరకు తన 'జిల్లాలో శిస్తు నిర్ణయం దానికమూలు తప్ప వేరే కార్యములను గూర్చి ఆలోచింపక పోవుట ఆశ్చర్యము.' ఈ మాటలు వ్రాసింది ఎవరో కాదు, సాగు నీటిపారుదలశాఖలో ఇంజనీరుగా తన అఖండప్రజ్ఞా మేధా సంపత్తును చూపి అందరిని ఆశ్చర్యచకితులనుగా చేసి, గోదావరినదిపై ధవళేశ్వరం వద్ద ఆనకట్ట కట్టి కొన్నివేల ఎకరాల గోదావరీమండలాన్ని సస్యశ్యామలం చేసి, డెల్టావాసులకు జలదానంతోపాటు అన్నవస్త్రాల సౌకర్యాలు కలుగజేసి, ప్రజలచే కాటన్ మహర్షిగా గౌరవింపబడిన మహానుభావుడు సర్ ఆర్థర్ థామస్ కాటన్ దొరగారు. 1858 సం లో భారత దేశాన్ని గూర్చి తన ఆవేదన వ్యక్తం చేస్తూ వ్రాసినపై సంగతులను 1858 డిశంబరు 12 తేది 'లండన్ టైమ్సు' (*London Times*) పత్రిక వివరించింది. ((1) *Life of Sir Arther Cotton by his daughter Lady Hope PP* 186-198 (2) 'విస్సన్న చెప్పింది వేదం-విన్సెంటు స్మిత్ వ్రాసింది చరిత్ర' అనే శీర్షికతో శ్రీ డి. వెం శివరావు ఆంధ్రపత్రికలో 24-5-1941నుండి 4 6-1941 మధ్యవ్రాసిన వ్యాస పరంపర.)

సర్ ఆర్థర్ థామస్ కాటన్‌గారు 1808-మే 15 తేదీన డోర్కిస్ సర్రేలో జన్మించి 17 సంవత్సరముల వయస్సులో 1820 లో భారతదేశానికి వచ్చి, మద్రాసు కంపెనీవారిఇంజనీరింగు శాఖలో పల్లపు సాగు నీటిపారుదలకు సంబంధించిన ఇంజనీరుగా పనిచేసి, ఛీఫ్ ఇంజనీరై 1861 లో 'సర్' అను బిరుదుపొంది *Knighted*గా బడి, 186 లో ప్రభుత్వ సర్వీసు నుండి రిటైరయి 1899 సం. జూలై 14 తేదీన స్వదేశంలో మరణించారు.

భారతదేశానికి వ్యాపారము నిమిత్తం గ్యాల కోసము వచ్చి ఎంతత్వరగా శ్వరు లవుదామా అనే ఆరాటంలో నియమాలు విడిచిపెట్టిన అధికారుల వ అమాయిక ప్రజలు పడేపాట్లు, వికోడు ప్రకృతి భీభత్సంతో కరవు టకాలు (1792), తుపానులు (1888, 40), ఉప్పెనలు వలన దేశములోని టలు నాశనమై అమితప్రాణ ఆస్తి నాలకు లోనైన ప్రజలను పన్నులపేర ఆంగ్లేయ కంపెనీ అధికారులుచేసే దోపిడీ ప్రపంచే ఇక్కడ విసే దెవరు? క్కడో పదివేలమైళ్ళ దూరాన వున్న ఇంగ్లాండు దేశప్రభువులకు ఇక్కడి మన డు ఎలా వినపడుతుంది. ఏలా తెలు ందిక్ ఇలాంటి పరిస్థితులలో మన కముగ వున్న కొంతమంది మహానుభావు న పాశ్చాత్యులు, అక్కడ పత్రికలకు వాసి, పార్లమెంటులో ఇక్కడ జరుగు ండిన దుష్పరిపాలనను గూర్చి వివరిం గాక రాళ్ళలాంటి హృదయాలు కూడా రగ సాగెను. ముఖ్యముగా బర్కుమహా శయుడు అతని మిత్రులు, వారి తరువాత 1847లో పార్లమెంటు మెంబరైన జాన్ బ్రైట్ దొరగారు మనదేశములో కంపెనీ పరిపాలనలో జరుగుచున్న దురాగతము లను ఖండించసాగిరి. మనదేశ దుస్థితికి గాలిపడిన దయార్ద్రహృదయులైన కొం దరు పాశ్చాత్యులు మనదేశ ప్రజలకు ఏదైనా శాశ్వతమైన సేవచేయవలె ననెడి మహోన్నత ఆశయాలు కలిగియుండిరి. అట్టివారిలో మనచరిత్రకు, సంస్కృతికి మహోపకారము చేసినవారు, మనదేశ సాంఘిక ఆర్థికపరిస్థితులను మెరుగుపర చినవారు నున్నారు. 1783లో సుప్రీము కోర్టు (కలకత్తా) లో పనిచేసి, భారత దేశ సంస్కృతిభావముయొక్క ఔన్న త్యాన్ని చాటిచెప్పిన, చరిత్రరచనలో కొక విప్లవమే తెచ్చిన, బెంగాల్ ఏషి యాటిక్ సొసైటీ కార్యదర్శియైన జేమ్సు ప్రిన్సెప్, 1880 లో భారతదేశ పురా తత్వ పరిశోధనశాఖ డైరక్టరుగానుండి భారతశిల్ప నిర్మాణములయొక్క విశిష్ట తను విదేశాలకు తెలియచేసిన అలెగ్జాం డరు కన్నింగ్ హాము, డాక్టరు హారెట్ గార్లు, అమరావతీ స్తూపాన్ని వెలుగులోకి తీసికొనివచ్చి అజంతాఎల్లోరా గుహలను కనుగొనుటకు సాయపడిన కర్నల్ మెకం జీగారు, ఫెర్గూసన్ బర్జసుగారలు మున్నగువారిని మనకు ఎనలేని ఉపకారం చేసినవారినిగ నేకాక మనజాతిసంస్కృతి సంప్రదాయాలను ఉద్ధరించిన పాశ్చా త్యులనుగా మనము జ్ఞాపకముంచుకొం టాము. 1780 లో మనదేశానికి వచ్చి 1800_1807 మధ్యదత్తమండలానికి కలె క్టరుగానుండి 1827లో మనదేశ సేవ లోనే చనిపోయిన సర్ థామస్ మన్రో గారిని 'మాండవ మహాముని'గా దత్త మండలాలలో జ్ఞాపకముంచు కుంటారు. (చూ. భారతదేశ సంస్కృతి నుద్ధరించిన పాశ్చాత్యులు ది. వెం. శి. ఆంధ్రప్రభ 17-4-1960) 19 శతాబ్దంలో ఉత్తర హిందూస్థానములో 16 సంవత్సరాలు జిల్లాజడ్జిగా పనిచేసి 1882-1885 మధ్య భారతదేశ పరిస్థితులను గూర్చి ఇండియా గజెట్ లో అనేక వ్యాసాలు వ్రాసిన ఫ్రెడరిక్ జాన్ షోర్ గారు మున్నగువారి కృషివలన ఇంగ్లాండులోని పార్లమెంటు వారికి చీమకుట్టి భారతదేశ పరిస్థితులను మెరుగు పరచవలె నని ఆలోచించుట ప్రారంభించిరి. భారతదేశములో కంపెనీ పరిపాలనపై కొంత నిఘా అవసర మని అనుకున్నారు. 1832లో వచ్చిన గాలి వాన 1840లోని తుపాను ఉప్పెనలవలన గోదావరినది ఉప్పొంగి పరవళ్ళు త్రొక్కుతూ డెల్టా ప్రాంతమంతా భీభ త్సం సృష్టించింది. పంటలు ముంచివేయ బడినాయి. ప్రజలు చెట్టుకి పుట్టకి గురై అగచాట్లు పడ్డారు. గోదావరినది పొంగి నప్పుడు జలాలు సముద్రములోకి పోయి వ్యర్థంకాకుండా చేస్తే బాగుంటుందని 1797 లోనే టోపింగ్ అనే ఇంజనీరు, ఆ తరువాత 1844లో సర్ హెన్రీ మాంట్ గామరీ అనే ఉద్యోగి ఆలోచిం చారే కాని అమలుకాలేదు.

రాజమహేంద్రవరం 16వ శతాబ్దం వరకు రెడ్డిరాజుల పాలనలోను, ఓఢ్ర రాజులపాలనలోను ఉండెను. తరువాత ఔరంగజేబుసామంతుడుగానున్న నైజాం 1724లో స్వతంత్రుడై సర్కారు జిల్లా లతోపాటు రాజమహేంద్రవరము ప్రాంతాన్ని కూడా లోబర్చుకుని, తన జాగీర్దారుల ద్వారా పరిపాలించసాగాడు. తరువాత 1958 లో ఫ్రెంచివారి పరిపా లనలోనికి వచ్చి1765 నాటికి ఆంగ్లేయుల వశమయ్యెను. పూర్వము రాజులు నిర్మిం చిన తటాకాలు, కాలువలు, పల్లపుసాగు నీటి వనరులు అశ్రద్ధచేయబడ్డాయి. కాటన్ దొరగారు మనదేశములో నున్న తటాకములు మొదలగు వనరులను శ్రద్ధగాపరిశీలించి, అవి నిర్మించిన తీరు పాశ్చాత్యశాస్త్రప్రావీణ్యముతో నిర్మిం చిన దానికి తీసిపోదని గ్రహించి వాటిని బాగుచేయించవలసిన అవసరముందనైనా ఉన్న దని మద్రాసుగవర్నరుకు వ్రాయు టయేగాక బోర్డు అధికారులకు డైరక్టరు లకు వ్రాసి, అంతటితో నూరకుండక 'లండన్ టైమ్సు' పత్రికలో గట్టిగా వ్రాశాడు. రాజమహేంద్రవరములోని ధవళేశ్వరము దగ్గర ఆనకట్టు కట్టుటవ గౌతమి, వశిష్ట నదీశాఖలకు బలమైన కట్టలు వేయుటకు కాలువలు త్రవ్వించి పడవల రాకపోకలకు సౌకర్యము కలిగిం చుటకు 'పిచ్చికలంక', బొబ్బర్లంక', 'మద్దూరు లంకలతో' గూడిన గోదావ రికి అడ్డము 4 200 గజాలు పొడుగున నాలుగు ఆనకట్టలు కట్టుటకు, ఆనకట్ట ప్రక్కగా గోదావరి నీరు కాలువలలోనికి పోవుటకు ఎత్తైన పెద్దతూములు నిర్మించు టకు గాను ఒకపథకము వివరించారు. చివరికి 1847 సం. లో మద్రాసు కంపెనీ ప్రభుత్వమువారు అనుమతి నిచ్చారు.

'గోదావరి ఆనకట్ట కూలీలు. వెట్టి చాకిరి' గురించి *P. B Smallett* దొరగారు *Madras and civil Administration* (1858) అనే గ్రంథములో ఇలా వ్రాశారు. 'ఈ ఆనకట్ట 1846 నుండి 1867 మధ్య నిర్మించారు. దీనిని, కట్టిన తరువాత ఈ జిల్లా ఆదాయం ఐదువందల రెట్లు ఎక్కువయిందనిన్ని, దీనిని అనుకున్న దానికంటె తక్కువ ఖర్చుతో కట్టినామని ఆకాలంలోని ఇంగ్లీషు కంపెనీ అధికారులు ప్రకటించారు. ధవళేశ్వరం వద్ద 1851 వరకు జరిగిన పనంతా బలవంతముగా చేయించిన వెట్టి చాకిరీయే. దేశంలోని ప్రతి గ్రామములోని వారు కొంతమంది కూలీలను సప్లయిచేయాలని నిర్బంధించేవారు. ఈ కూలీ జనాన్ని కలెక్టరు క్రింది దేశీయ అధికారులైన జిల్లా తాసిల్దారులు ప్రోగు చేసి తీసికొని రావాలి. అలా తీసికొని రాలేని వారిని పనినుండి తీసివేసేవారు. కూలీలను కొట్టి తిట్టి పని చేయించేవారు. కూలీ జనానికి అధికారులివ్వ నిర్ణయించిన కూలి అతి స్వల్పంగా ఉండేది. ఆ నాలుగు డబ్బులైనా పూర్తిగా వాళ్ళ చేతిలో పడేవి కావు. వాళ్ళ పొట్టనిండా కూడు వుండేది కాదు. వీళ్ళ తిండికని చుట్టు పక్కల గ్రామాలనుండి విరాళాలు ప్రోగుచేసేవారు. ఈ వెట్టి చాకిరీ చెయ్యలేక, బాధపడలేక, కూలీలు పారిపోతూ వున్నందున వాళ్ళను పట్టి కొట్టి నిర్బంధించేందుకు పోలీసు సిబ్బందిని కాపలావుంచేవారు వాళ్ళకు శిక్షలు వేసి నిర్బంధించి యుంచడానికని మేజిస్ట్రేటును కూడా అక్కడనే నియమించేవారు. ఇలాగ బలవంతముగా నిర్బంధించి వుంచిన కూలీ వాళ్ళే కాని తమంతట తాము వచ్చిపని చేసే కూలివాళ్ళు లేనేలేరు. ఇలాగ కూలీల రక్తమాంసాలను పిండి పని చేయించిన వాళ్ళే దీని ఫలితంగా జిల్లా ఆదాయము పెరిగిందని గొప్పలు చెప్పుకోవడంచాలా ఘోరము. చూ. 11-4 1948 ఆంధ్ర పత్రికలోని ది. వెం. శి. గారి వ్యాసము.)

అయితే కాటన్ దొర మొదలుగాగల కొందరు మానవత్వము, దయ దాక్షిణ్యము, దైవభక్తి, గల వారికి ఈ వెట్టి చాకిరీ విధానము నచ్చలేదు. వారు మద్రాసు గవర్నరు గారికిని, కంపెనీ బోర్డుకు వ్రాశారు, ఇది అన్యాయము అని ఫిర్యాదులు చేయటముకూడా జరిగింది. 'ఈ పాపకార్యములో తామెందుకు భాగస్వాములుగా నున్నామా అని తమతో చెప్పారని', 'ఇంకా బ్రిటిష్ సామ్రాజ్యములో అనేక చోట్ల చేయడానికి వీలులేని ఘోరాలు ఈమద్రాసు కలెక్టరుల క్రిందనున్న బ్రిటిష్ అధికారులు ఈ గోదావరి ఆనకట్ట నిర్మించే సందర్భంలో చేశారని' స్మాలెట్ గారు వ్రాశారు.

1852 సం. నాటికి ఆనకట్ట నిర్మాణము కొంత సాగింది. కానీ ఆసంవత్సరము గోదావరికి వరదలు ప్రారంభమయ్యాయి. కట్టిన భాగాలలో కొన్ని కూలాయి. మరల మొదట వేసిన అంచనాలను దాటి ఖర్చులు చూపిస్తున్నారు కలెక్టరు క్రింది అధికారులు. పైనుంచి ఇంకా ఎంత కాలము పడుతుందని అడుగుతున్నారు. అసలు గోదావరికి వారధికట్టడమేమిటి? ఇది సాధ్యమా? అని సందేహాలు వెలిబుచ్చారు స్థానికులు. ఈ కాటన్ దొర ఏమైనా శ్రీరామచంద్రుడా సముద్రానికి వారధికట్టి నట్లు కట్టడానికి అన్నారు. వరదవలన ప్రాణనష్టము కూడా జరిగింది. గోదావరి తల్లికి కోపమువచ్చింది. శాంతి జరగాలనీ లేకపోతే, ఊరునామ రూపాలు లేకుండా పోతుందని ప్రజలు భయపడ సాగారు. ఎవరు ఏమనుకున్నా, కాటన్ తన సాహసము మానలేదు. కూలీలు నీటిలోనికి దిగి జారి కొట్టుకు పోతూంటే తనే ధైర్యముతో నీళ్ళలోదిగి ప్రాణానికి తెగించి సాహసంతో పని వారికి ధైర్యము కలిగించాడు. పనివాళ్ళని ఎంతో దయతో ఆదరించి, యోగక్షేమాలు కనుక్కుంటూ తనుకూడా స్వయముగా పని చేస్తూ వాళ్ళకి లేనిశక్తిని, చైతన్యాన్ని, కలుగచేసాడు. ఆనకట్ట పూర్తి అయితే దానివలన కలిగే లాభాలనుగూర్చి, స్థానికులకు స్వయముగాచెప్పి, సహకారము పొందాడు.

కాటన్ దొరను చూస్తే పనివారికి కొండంత ధైర్యము కలిగింది. ప్రజలలో గొప్ప గౌరవము కలిగింది. మరల పని చురుకుగా సాగింది. ఆనకట్ట పని చాలా వరకు పూర్తికావచ్చింది. ఇంతలోనే మరల వరదలు ప్రారంభమై రాత్రికిరాత్రి కొత్తగా కట్టినదంతా కొట్టుకుపోతుందా అనే స్థితికి వచ్చింది. కాటన్ దొరగారు ఆసమయములో తీవ్రమైన జ్వరంతో లేవలేని స్థితిలో మంచాన్ని పట్టి ఉన్నాడు. దొరగారి భార్య పరుగునవచ్చి, 'ఆర్థర్ వరదలు భయంకరంగా వచ్చాయి అంతా అయిపోయింది. నువ్వు ఇన్ని సంవత్సరాలుగా నిర్మించిన ఆనకట్ట, శ్రమ, అంతా క్షణాలలో కొట్టుకు పోతుం' దని వణుకుతో భయపడిపోతూ చెప్పింది. అప్పుడు కాటన్ దొరగారు రెండుచేతులూ పైకెత్తి నమస్కరిస్తూ, 'ఓ భగవంతుడా నువ్వుంటూ ఉంటే ఈ అమాయిక ప్రజల కోసము నేను కట్టిన ఆనకట్టకు ఏ హానీ జరగదు' అన్నాట్ట! వరదలు మెల్లగా తగ్గటము ప్రారంభించాయి. ఆనకట్ట చెక్కుచెదరలేదు. భగవంతుని మీద దొరగారికున్న అచంచల విశ్వాసము ఆయన్ని నీతిపరునిగా చేసింది.

# వరూధిని

— డా॥ వి. దొరస్వామి నాయుడు, ఎం. ఏ., పిహెచ్.డి.,

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానాన్ని అలంకరించిన అష్టదిగ్గజ కవుల్లో అల్లసాని పెద్దన మొదటివాడు. పెద్దన మనుచరిత్ర ఆంధ్ర పంచ కావ్యాల్లో విశిష్టమైంది. మనుచరిత్ర రచనా పరమార్థం ఎలా ఉన్నప్పటికీ ఆ ప్రబంధం పేరు తలపగానే మనకు గోచర మయ్యేవారు వరూథినీ ప్రవరులు. ఆరాశ్వాసాలతో అలరారే ఈ ప్రబంధంలో మొదటి మూడాశ్వాసాలకే ప్రాధాన్యం ఏర్పడింది అందులోను ప్రవర వరూథినీ, సంవాద ఘట్టానికే ప్రాధాన్యం ఎక్కువ. ఇందులోని కథాసన్నివేశంతో పాటు కవితారీతి కూడా కొంత కారణం కావచ్చు. పెద్దన వరూథిని పాత్రను అపూర్వంగా చిత్రించాడు.

ప్రవరుడు సద్వంశంలో జన్మించిన బ్రాహ్మణుడు. వరూథిని అచ్చరలేమ. ప్రవరుడు తీర్థయాత్రాభిలాషియై ఉండగా, సిద్ధుడొకడు ప్రవరుని కాళ్లకు పసరు పూసినాడు. పసరు ప్రభావంచే ప్రవరుడు హిమాలయం చేరినాడు. మంచు కారణంగా పాదలేపం పూర్తిగా కరిగిపోయింది. ప్రవరుడు గమనించలేదు. పురమార్గాని కై తీవ్రంగా అన్వేషించాడు. గంధర్వ యక్షగాన ఘూర్ణితమైన ఒక్క కోనను చూచినాడు. స్వపురం చేరవచ్చునని భావించాడు. ముందుకు నడవగా కస్తూరి, పచ్చకర్పూరాల కమ్మని సువాసనలతో, తాంబూల పరిమళంతో కూడిన గాలి వీచింది. ఆ గాలి జనగాలి జాడను తెలియ జేసింది. వరూథిని ప్రవరుని కంట పడింది. ఆమె రూప లావణ్యాదులను పెద్దన ఇలా వర్ణించాడు.

'అతఁ దావాత పరం పరా పరిమళ
వ్యాపార లీలన్ జనా
న్విత మిచ్చోటని చేరఁబోయి కనియెన్
విద్యుల్లతా విగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీక చికురన్
జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొక మరు
న్నారీ శిరో రత్నమున్' (2-25)

వీణ వాయించుచున్న వరూథిని నవలావరసన్నిభుడైన ధరామరుని చూచింది. ఆ సమయంలో ఆమె స్తన ద్వయం పులకించింది. ఆమెచూపులు మామూలు చూపులు కావని, వికసితోత్పల పంక్తులని పెద్దన అభివర్ణించాడు. పరపురుషుడన్న విచక్షణతో ఆమెకు సిగ్గు ముంచుకొని వచ్చింది. పోకచెట్టు చాటుకు వెళ్ళి కూర్చుంది. వెంటనే వేగంగా లేచింది. కనుచూపులను ప్రవరునిపై ప్రసరింప చేసింది. చూపులతో పాటు ఆమె మనసు కూడా ప్రవరునిపైపే సాగించింది.

వరూథిని అందచందాలున్న అప్సర స్త్రీ. ఆమె కటాక్షములకు గంధర్వయక్ష తనయాదు లందరు వరూథిని చుట్టూ తిరుగుతుంటారు. వారి నందరిని వరూథిని చూచి రోయుచున్నది. వారి సౌందర్యం వరూథిని ముందు నిలువలేదు. ప్రవరుని చూడగానే ఆమెను కామదేవత వరించింది. అలేఖ్యమైన మకరాంక, శశాంక తనూ విలాసుడైన ప్రవరుని సౌందర్యానికి ఆమె ముగ్ధురాలయింది. ప్రవరుడు కంతు, వసంత, జయంతుల కంటె సౌందర్యవంతుడని వితర్కించుకొంది. ప్రవరుని భార్యను కాగలిగితే మన్మథునిచే ఊడిగం చేయించుకొందునని భావించింది. ఇలా తలచిన వరూథిని మాట్లాడలేదు. పరపురుషునితో తనంతట తాను మాటాడదు. మాట్లాడినచో ఆత్మ గౌరవానికి లోటు. అందువల్ల ప్రవరుడే మాట్లాడవలయునని వరూథిని భావించిది. ఇందులో తప్పు లేదు.

ప్రవరుడు వరూథినిని సమీపించి 'భీతహరిణేక్షణ! నేను బ్రాహ్మణుడను, పురమార్గం తెలియక వచ్చాను. దారి చూపుము. నీకు శుభమవుతుం' దని పలికినాడు. నేను బ్రాహ్మణుడను. నీవు

---

ఈ దొర తరువాత మద్రాసు కంపెనీ వారి పాలిత ప్రాంతానికంతకూ చీఫ్ ఇంజనీరయ్యాడు. 1861 లో ఈయన్ని *Sir* అనే బిరుదు నిచ్చి ఆంగ్లేయ ప్రభుత్వమువారు *Knighted* చేసి సత్కరించారు. 1862లో ఈయన రిటైరయి స్వదేశానికి వెళ్ళి 1899 జూలై 14 తేదీన సర్రేలో మరణించారు. ఈయన భారతదేశానికి ముఖ్యంగా గోదావరి జిల్లావాసులకు తంజావూరు పరిసరాలకు చేసిన సేవ అమోఘమైంది. ధవళేశ్వరములో ప్రజలు ఈయన విగ్రహాన్ని నెలకొల్పారు. ఇది తరువాత వరదల పాలైంది. అయినప్పటికీ గోదావరీ వాసుల హృదయాలలో వారి మూర్తి ఇంకా చెక్కు చెదర లేదు. గోదావరీ నదిలో స్నానము చేసి ఒడ్డున కూర్చుని భక్తితో, 'ఓం, కేశవాయ స్వాహా, నారాయణాయ స్వాహా' తో పాటు ఓం, కాటనాయ స్వాహా, నారాయణాయ స్వాహా!' అని కూడా అనుకుంటారని చెప్పుకుంటారు.

—•••—

కన్యవు, నా ఆశీర్వాదం వల్ల నీవు తొందరలోనే సౌశీల్యవతుం దను ధ్వని ఇందు గోచరిస్తుంది. ప్రవరుని ప్రశ్నకు వరూథిని ఇలా సమాధాన మిచ్చింది.

'ఇంతలు కన్నులుండఁ దెరు
  వెవ్వరి వేఁడెదు? భూసురేంద్ర! యే
కాంతము నందు నున్న జవ
  రాండ్ర నెపంబిడి పల్కరించుటల్
గింతయు కాక నీ వెఱుఁగ
  వే మును వచ్చిన త్రోవ చొప్పు? నీ
కింత భయంబు లేక కడు
  నెల్లిద మైతి మె? మాట లేటికిన్'

(2-41)

ఏకాంతంలో ఒంటరిగానున్న యౌవనవతిని పలకరించాలని ప్రయత్నం కాకపోతే మీరు వచ్చినదారి మీకు తెలియదా? అని వ్యంగ్యంగా మాట్లాడింది ఈమాటల్లో ఆమె నిగూఢమైన ప్రేమ భావం వ్యక్తమవుతుంది. తన పేరు 'వరూథిని' అని సూటిగా చెప్పింది సౌందర్యవతులైన రంభా తిలోత్తమాదులు తన ప్రాణ సఖు లన్నది. రంభాదులు దేవవేశ్యలు తాను కూడా దేవవేశ్య ననే భావం ప్రవరునికి కలగా లని వరూథిని ఉబలాటం. 'భూసుర కైతవ కుసుమ శరాసన! మాయింటి విందవై' అతిథ్యాన్ని స్వీకరించు మని ప్రాధేయపడింది.

ప్రవరుడు వరూథిని అభిప్రాయాన్ని గ్రహించి, తన ఊరికి పోవాలని నిశ్చయించుకొన్నాడు. ఇల్లు చేరు ఉపాయాన్ని కరుణింపు మని కోరినాడు. తన ఆత్మకు విరుద్ధమైన ప్రవరుని మాటలకు వరూథిని కోపగించుకొంది. 'ఎక్కడి యూరు? ఇక్కడ కాలునిలుపలేవా? ఈ రత్న కందరాలు, లవలీనికుంజాలు, గంగా సైకతములు, మీ ఊరికి సరిరావా? అని పలికింది పరోక్షంగా చెప్పి లాభం లే దను కొని 'నిక్కము దాప నేల ధరణీసుర నందన! యింక నీ పయిం, జిక్కె మనంబు నాకు' అని యథార్థాన్ని ప్రకటించింది. స్త్రీ చేత యింత నగ్నంగా చెప్పించడం కవి ఒకవిధంగా ఆమెను శిక్షించడమే అని చెప్పవచ్చు.

వరూథిని మాటలకు ప్రవరుడు చెవులు మూసుకొన్నాడు. ప్రవరుడు వివాహితుడు, ఏకపత్నీ వ్రతుడు, నియమనిష్ఠుడు, 'వ్రతులైన విప్రుల కామింప జనునె, మది విచారము వలదే' అన్నాడు. భోగా లనుభవించాల్సిన యౌవనంలో వైదిక కర్మనిష్ఠ చేయడం భావ్యం కా దని వరూథిని పలికింది. ప్రవరుడు ఉత్త చాదస్తపువాడని నిందించింది. వేదాల్లోని సారాంశాన్ని తన అభిప్రాయానికి అనుగుణంగా మార్చుకొంది. కాని ప్రవరుడు ఆమె మాటలకు లొంగలేదు. 'వనిత తనంత తాఁ వలచి వచ్చిన చుల్కన గాదె యేరికిన్' అని పలికింది ఇది లోక సమాజసిద్ధమైన వాక్యం కామోద్రేకంచే పాలిండ్లు పొంగార ప్రవరుని కౌగిలించి, అధరాన్ని ఆశించింది. ప్రవరుడు హా శ్రీహరీ! అని త్రోసి వచ్చాడు. 'కలంచునే సతుల మాయల్ ధీరచిత్తంబులన్' అని కవి సమర్థించాడు. ఆడువారి మాయలు నిలకడ మనసు కలవారిని ఏమీ చేయజాలవని కవి నిరూపించాడు.

వరూథిని తన ప్రయత్నాన్ని అంతటితో విరమించుకోలేదు 'భవన్నఖాంకురము సోఁక' నని వక్షఃస్థలమును జూపి 'కృపారహితాత్మక' అని ప్రవరుని నిందించింది వయసు కావలయు నని కోరిన వరూథిని దయలేనివానినిగా ప్రవరుని తిట్టినది. అందుకే 'స్త్రీ బుద్ధిః ప్రళయాంతకః' అని అంటారు. ఈ మాటలు వరూథిని లో సార్థక మయ్యాయి. తుది ప్రయత్నంగా పురాణ పురుషులైన పరాశర, విశ్వామిత్ర ఇంద్రాదుల వేశ్యాలోలత్వాన్ని అభివర్ణించినది. వారికంటె ప్రవరుడు మిన్నకాడని వరూథిని భావం. అప్పటికీ ప్రవరుడు సుముఖుడు కాలేదు. చివరకు ప్రవరుడు అగ్ని దేవుని ప్రార్థించి అరుణాస్పద పురము చేరినాడు.

ప్రవరుని నిష్క్రమణంతో వరూథిని ఏకాకి అయింది.' 'పూజకొద్ది పురుషుడు' అను నానుడిని అనుభవంలోనికి తెచ్చుకొంది. మర్త్యకాంతల అదృష్టానికి సంతోష పడింది. భర్త మెచ్చుకోలు లేక పోతే మానవకాంత మరణించగలదు. కాని వరూథిని అమరకాంత నయినందున నాకు ఆ అదృష్టంకూడా లేదని బాధ పడింది. మరణమే ఉంటే వరూథిని మరణించి ఉండేది. దేవతా స్త్రీ ఇంత విరహవేదన అనుభవించుటచే పాఠకుల మనసు నొచ్చుకొనును. ఈవిధంగా వరూథిని పాత్రను పెద్దనగారు అపూర్వంగా చిత్రించి, పాఠకుల మనసును రంజింప చేశారు.

* * *

# సంపంగి మనసు

—రచన : కొలకలూరి స్వరూపరాణి

సే మాలతి, యేపె పొన్న, విరజా
జి, మల్లి, మందారమా,
మంచే కద మీకు మీ భ్రమర సం
శ్లేషాసుఖ శ్రీలకున్.
గ పొందాలకు నోచినమ్మ లలికిన్
మీ పొంద మా పొందమా
పొందాలను బాపమేమిగలదో
నన్నొల్లడీ సంపెగన్.
కులమః దేంట్ల కన్నది య
వాదిగః దేనియ లొల్కనట్టి బం
మది లోక సమ్మతము
దైవము జేసిన న్యాయ నిర్ణయం
బిది యేమి దుష్టజన
వాంతర కర్మఫలంబొ సాధుదే
దరిజేరడమ్మ జన
నంబును గాంచితి రిక్తపూలలో.

అందము గంధమాకృతియు
మార్దవమున్ కలంవంబులుండి చే
దిన భోగమేమి? కని
యంగిటిలోః గలదన్న యట్లుగా
దుచు పాటి చేడియల
కున్ పరిహాసము గాగ కొందఱం
దుచు నేద్యే గంధవలి
నై జనియించితి నేమి యాభువిన్.
హారెకు రట్టుం జేసెదరు
సంపెంగ భర్తృ విదూర యన్న సం
రత్రు గుట్టుః గేలి వి
పాద చరిత్రమ నన్ను నైత కా
రము జేసి నిర్వేద రు
దాహరణన్ వినూతన్న సృష్టిలో
నారడిః కెట్టు యీ యన ద
యా తను గొంచె కవీశ్వరాళిన్.

*పలుకును చంచరీకముల
పాలిటి జంపక మేనటంచు గా
రులః, ఝళిపించు వేళల వి
రోధుల నొక్క కలంబునుండి తా
కెలువడి నట్టి నాయకుడు
వేడుకలాళి మము బోంట్ల కాపుర
మ్ముల, రస హీన గాథలను
బోలిక జూపుచు రచ్చకీడ్చుటల్.

*పెనిమిటి రొమ్ము డన్న వ్యథ
బెద్దయు రంపఁగః గోర యాచు నా
మనసును జీరుచుండు నవ
మానము లోకులు గాకులయ్యె దా
ల్కన గొనునట్లు మమ్ములను
గావ్యములన్ బడనీడ్చి హేళనల్
బొనరుప నేల చేటను
పుట్టరె యీ కవులాడు తోడునన్.

*మనువు గవీంద్రు డొక్కరుడు
ముద్దుల నాయిక నాస పోటుగం
బున వచియించె మా విధుర
మున్కుర దుర్భర జీవనంబు చే
కొన మెయినరించి భేమని త
లల్ రసికాగ్రణులు లూచ, ముగ్ధ మో
హన కుసుమారి లేక వ్యాధ
యంబున మంటలు గాంచ రెవ్వరున్.

*విందొనరించి యుంటి నతి
వేలముగా హృదయాన పొంగు మా
రంద మిళింద మానమును
రాగ పరంపర కంటకంబు గా
క్రందుగ క్రొత్తరించు నవ
కంబగు తావి విడెమ్ముగాగ నిం
దిందిర మేల నైకొవదు
తీయని నా ప్రణయాతిథేయమున్.

*మధువులు జాలువారు కుసు
మానిని జేసు వసంత రూపిణిన్
మధువుల వారగ్రోలి మధుపాయి
సమాఖ్య కెలంగు నట్టి మ
న్మథ రణరంగ రమ్య ప్రథ
న ప్రమదోద్భవ పుంస్త్వకాలి, నా
యధరము మాని, భృంగ మెటు
లొ చెలి వీడనో వ్యర్థ బుద్ధియై.

*మురిసిన యౌవనంబు నవ
మోహ రసాబ్ధి వెలార్చి తేనిలో
బుస బుస పొంగు వేళ విర
బూచిన మంజుల మార్దవంబుతో
మిసమిసలాడు నీ మధుర
మేనున నన్ కరుణా విహీనుడై
భసలము త్రోసి పోయెడిని
పంచ శిలీముఖ తాప వహ్నిలో.

*పొరుగింటిపుల్ల కూరకు
పరుగిడు తత్వమ్ము వెంట బట్టిన మగ వా
రెరుగరు కలసతి మదిలో
విరిసిన తొలివలపు పండు వెన్నెలపోనల్.

*పారము లేక సాగెడి ప్ర
వాహము స్త్రీ యనురాగ ప్రాంతియే
పారము లేని యొక్క తృణ
సన్నిభ దివ్య సఖీ మనోహరా
కారగ గోచరించు నవ
కంబుగ నీ మగవారి కంటి కే
పారు విలాస శోభకన
రైయి తుంటరులు గడ్డిపువ్వులన్.

*నవ్యతలో కేకక్రొడి
నవ్య క్త సుఖాను భూతి యన్య స్త్రీ లో
ఆత్యగ్ర చిత్తునకు మ
ద్దివ్యన్న్యుడు రాగరసము తియ్యంబగునే.

# సర్పపుర (క్షేత్ర) మాహాత్మ్యము ఒక పరిశీలన

— శ్రీ ఎం. భాగయ్య, ఎం. ఏ.,

ఈ క్షేత్రమాహాత్మ్యమును రచించిన కవి శ్రీ కూచిమంచి తిమ్మన. మూలము బ్రహ్మవైవర్త పురాణము నందలి దని చెప్పెడి పద్యము

వలనొప్పు బ్రహ్మవైవర్త పురాణోక్త
 మై సర్పనగర మాహాత్మ్య మలరు
నది యేను శాలివాహన శకాబ్దంబులు
 పాటింప వేయు నార్నూట డెబ్బ
దాఱగు భావమహోవత్సరంబున
 భావనారాయణ దేవదేవు
నానతి వలన నిట్లాంధ్రం బొనర్చి యా
 స్వామికి దేవతా చక్రవర్తి
కర్పణం బాచరించితి నధిక భక్తి
నిమ్మహా పుణ్య చారిత్ర మిద్ధరిత్రి
నా సుధాకర తారార్క మగుచు సజ్జ
నోత్తముల యిండ్లనే ప్రొద్దు నుండుగాక

అని తెలుపుట వలన శా. శ. 1675. అనగా క్రీ. శ. 1754 సం॥ న దీనిని రచించినట్లు తెలియుచున్నది.

భావనారాయణస్వామి యానతివలన ఈ పుణ్యచరిత్ర ఆంధ్ర మొనర్చితి నని కవియే స్వయంగా చెప్పుకొన్నాడు. ఇంకను భూమిపై సూర్యచంద్రాదు లున్నంతకాలము ఈ పుణ్యచరిత్ర నిలిచి యుండు నని చెప్పెను. ఈ క్షేత్రమిచట గల దనుట కాధారమైనపద్య మొకటి.

పుడమి గోదావరిం దూర్పు కడను దుల్య
భాగ నుద క్తటంబున బశ్చిమమున
వారి రాశికిఁ గ్రోసెడు చేర సర్ప
పురమహాక్షేత్ర మభిరామ గరిమ నలరు.

నేటికి సర్పవరమను గ్రామము, భావనారాయణస్వామిగుడి సామర్లకోట సమీపమున (గల) తూర్పుగోదావరిజిల్లా యందలిదే యని గట్టిగాఁ జెప్పవచ్చును. ఇచట మూడు సరోవరంబులు గల వని చూపెడి పద్య మొకటి.

నారద సరోవరంబు ననంత సరసి
ముక్తికాసారమును నన మూఁడు తీర్థ
ములు తిరింపఁగఁ జేయుఁబో తలచినపుడె
సర్వగురిక ప్రపూర్ణలౌ జంతువులను.

అని గలదు. ఈ సర్పపుర కథను అగస్త్యమహాముని శౌనకునకు తెలిపిన పురాణ పుణ్య చరిత్ర . ఈ కథయందు కద్రువ (నాగమాత) తనయుడైన అనంతుని చరిత్రగలదు. తల్లిశాపము వలన అగ్ని కాహుతి కాకుండ విష్ణుమూర్తికై తపస్సు చేసి, యాతడు పుణ్యము పొందినట్లు గలదు. అనంతుడైన ఆదిశేషుడు తన వృత్తాంతమును విష్ణుమూర్తికి తెల్పెను ఈ విషయము గ్రహించిన హరి కనికరించి, ఈ కొలను పావని, ఈ పురము నీకపుడు సర్పత్వము పరిసర్పిత మైయొప్పు, ఆ పేరనే యీ క్షేత్రము ప్రసిద్ధమగు నని దీవించెను ఈ పుర మందలి విష్ణుప్రతిష్ఠను గూర్చి యగస్త్యుడు శౌనకునకు కథ చెప్పెను. నారదుడు బ్రహ్మసభకు వచ్చి నపుడు నారాయణుని యుత్కృష్టత్వ మును బ్రహ్మ వర్ణించెను. సభలో నారదు డిట్లు పల్కెను

శివుని మీదనైన శ్రీరాబ్ధి కన్యకా
 ధవుని మీదనైన దలపు నిలిపి
నతినుతి ప్రపూజనముల సంతసిలంగఁ
 జేయు ఘనుఁడు ప్రకృతిఁ జెందకుండు.

అనుటచేత బ్రహ్మ నారదుని శపించెను నారదుడు సర్పపురము చేరెను అచటి కొలనులో మునిగి స్త్రీ యయ్యెను. సుదతి యని నామము వడసి, భర్తకై, పుత్రుల బడయ సంచరించు చుండ వనములో నిషండరాజు వచ్చి చూచి ప్రేమించెను.

ఈ రాజు వలన సుదతి ఇష్టోప భోగము లనుభవించి పుత్రులను బడసెను. కొన్నాళ్ళకు మగడు సుతులందరును రిపుంజయు డను రాజు చేతిలో నోడి చనిపోయిరి. చనిపోయిన భర్త, మరియు పుత్రులకై శోకిస్తూ, అచటినుండి ఆకలితో నొక మామిడి పండుచూచి తెంపపోగా నది యందక బాధపడెను. అట్టియెడ హరి వృద్ధవిప్రుడై వచ్చి సుదతికి నీ వెవర వని నీవసి చరంచే మని ప్రశ్నించెను. నీ కెందుకు విప్రవిర్యా! నీ త్రోవను పొమ్మని సుదతి కోపించెను. అయినను హరి కరుణించి యడుగ ఆసుదతి ఓ దేవా! కుండధాత్రీ నాథ కుంజరునకు భార్యనై, బహుభాగ్యంబు లనుభవించుచు మనోజాకృతులు, శస్త్రాస్త్ర విద్యావిశారదులు నగు నూర్వురు పుత్రులను కంటినని తన సంగతి వివరించెను. అంతలో ద్విజపుంగవుడయిన విష్ణువు సుదతితో నిట్లనెను.

---

*గర్వంబ సాటిరాని పర
 కాంతలకైయలి షట్పదంబులున్
సొవ్వగ పస్వ్వలెత్తు వన
 నందు కులాంగన నంచు జంకకే
క్రొవ్విన నన్ను తాకి రుచి
 రోజ్జ్వల యౌవన సౌరభంబులన్
త్రవ్వఁగ త్రాగ చూచు మగ
 రాయని నవ్వర సాటినాయకుల్.

*ఆ పుండై యలరింప నల్ల సఖుడ
 న్యాక్రాంతుడై పోయె నా
పాత్రివ్రతంబింతియె పెట్టి పుట్టకయె సౌ
 భాగ్యంబు లెట్లబ్బునన్
త ప్తస్వాంతము నుండి పెల్లుబుకుచున్
 నా యూర్పులే వల్పులై
వ్యాప్తాలై మలయానిలంబువలె నా
 పాదించు సౌరభ్యముల్.

*కేళుల్ మాపులు వేచి చూచెదను హా
 రి ప్రేమ సంసిద్ధికై
దీపింపన్ మధురాను రాగ మెద మా
 ధ్వీ నిర్ఝరంబట్లు స
ల్లాపస్పూర్కుల గారవించ డొకటో
 ల్లాసంబుగా నక్కునన్
రూపాంతంబున నైన నా కొదవునే
 రోలంబ మాలంబమై.

* * *

Regd. No H/Rmy-42.　　Samalochana I,　　February 1988



గురుమతులు తపసు లంతఃకరణంబుల శుద్ధిసేయ ఘనతరభక్తిన్
హరియందు సమర్పింతురు పరమానందమున భిన్నభవబంధనులై.

పరమపూరుషు డొక్కడె యాఢ్యుఁడు పాలనోద్భవనాశముల్
సొరిదిఁ జేయ ముకుంద పద్మజ శూరి సంజ్ఞలఁ బ్రాకృత
స్ఫురిత సత్త్వరజస్తమంబులఁ బొందు నందు శుభస్థితుల్
హరి చరాచరకోటి కిచ్చు ననంత సత్త్వనిరూఢుఁడై.



సమాలోచన 3,4,5,6,7,8,9,10 వార్షిక సంపుటముల వెల వరుసగా 20, 20,12,15,15,15,15,20రు. లు ఎం. ఓ. చేసినవారికి ఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోస్టులో పంపగలము. వి. పి. పద్ధతి లేదు.

— సంపాదకుడు.

అడ్రసు :—
సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి
రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. కె. కాలేజి,
6-4-24, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్),
రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innispeta,
(Tyagaraja Nagar, Rajahmundry-1.